# విజ్ఞాపనము.

గోవిందమంజరినిఁగూర్చియు సుప్రసిద్ధులయిన తత్ప్రచయితలఁగూర్చియు వ్రాయం గడంగుట యెంతయనావశ్యకము. దానిని గంధపద్యంబులతో నాంధ్రీకరించిన మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నశర్మకవివరునిఁగూర్చి వ్రాయంబూనుటయు నంతయనావశ్యకమే యగును. కనుక నా ప్రయత్నమును మాని, యకవివరుండు తన్మంజరిని స్వీయరచితవ్యాఖ్యతో నిజపత్రికయయిన యాంధ్రభాషాసంజీవనియందుం బ్రకటించె ననియును దానిప్రతి నొకదానిని దత్కవివరజ్యేష్ఠపుత్త్రుండగు శ్రీయుత కొక్కొండ వేంకటనరసింహశర్మగారు నాకొసంగి దానిని పుస్తకాకారముగాఁ బ్రకటింపుఁడని నన్నుం గోరుటవలనఁ దత్కవివరునందు నాకుం గల గౌరవసూచకముగా నద్దాని నట్లు బ్రకటించితి ననియును వ్రాయుటయే సముంజసము.

విశాఖపట్టణము,
౩౦-౮-౨౧.

విబుధవిధేయుఁడు,
శ్రీ విక్రమదేవవర్మ.

శ్రీ

# గోవిన్దమఞ్జరి.

శ్లో॥ భజగోవిందం భజగోవిందం । భజగోవిందం మూఢమతే।
సంప్రాప్తే సన్నిహితే కాలే । నహి నహి రక్షతి డుకృఞ్కరణే॥

క॥ గోవిందుం గోవిందుం । గోవిందుం గొలువు కొలువు కొలువుము కుమతీ!
ప్రాపదిది డుకృఞ్కరణే। నావలు త్వదుక్తి వృత్తిగ నంగ నిన్నున్నన్॥

శ్లో॥ మూఢ జహీహి ధనాగమతృష్ణాం । కురు సద్బుద్ధిం మనసి వితృష్ణాం।
యల్లభసే నిజకర్మోపాత్తం । విత్తం తేన వినోదయ చిత్తం॥

క॥ విడుమోమూఢ! ధనాశన్ । గడుకొని సద్బుద్ధిఁగనుము కనుము నిరాశన్।
విడిముడి కర్మాయత్తముఁ । బడసెద వెద్దాన దానఁ బరఁగింపు మెదన్॥

శ్లో॥ నారీస్తనభరనాభీదేశం। దృష్ట్వా మాగా మోహావేశం।
ఏతన్మాంసవసాదివికారం। మనసి విచింతయ వారం వారం॥

క॥ నారీస్తనభరనాభిగ। భీరతలంగాంచి భ్రాంతిఁ బెనఁగొనకుము త।
చ్ఛారుత మాంసవసాదివి। కారతయని సారెకరసి కనుఁగొనుము మదిః

శ్లో॥ నళినీదళగతజల మతితరళం। తద్వజ్జీవిత మతిశయచపలం।
విద్ధి వ్యాధ్యభిమానగ్రస్తం। లోకం శోకహతంచ సమస్తం॥

క॥ నళినీదళగతసలిలము। లలిఁ జంచల మటుల బ్రదుకిల నతిచపలమా
దెలియుము వ్యాధ్యభిమానవి। లులితము శోకహత మఖిలలోకం బను

శ్లో॥ యావద్విత్తోపార్జనసక్తః। స్తావన్నిజపరివారో రక్తః।
పశ్చాజ్జీవతి జర్ఝరదేహే। వార్తాం కోపి నపృచ్ఛతి గేహే॥

క॥ ఎందాఁక ధనోపార్జన। వం దానక్తుండో మనుజుఁ డందాఁక నెఱిం
గందురు నిజజనులందఱు। మందిరమున నడుగ రెవరు మఱి చివికినన్

శ్లో॥ యావ త్పవనో నివసతి దేహే। తావత్పృచ్ఛతి కుశలం గేహే।
గతవతి వాయౌ దేహాపాయే। భార్యా బిభ్యతి తస్మిన్కా-యే॥

క॥ ఎంతవఱ కొడల నసురో। యంతవఱకు నడుగు గేమునందు సేమం।
బంత యసురరుగ నయ్యొడ। లెంతయు వెఱచుంగ నంగ నిల్లాలుఁజుమీ।

శ్లో॥ అర్థ మనర్థం భావయ నిత్యం। నాస్తి తత స్సుఖలేశ స్సత్యం
పుత్రాదపి ధనభాజాం భీతిః। స్సర్వత్రైసా విహితా రీతిః॥

క॥ కను మెద నర్థమనర్థం। బని దాన స్సుఖలవంబు నలవడదు నిజం।
బెనయుఁ దనూజునివలనను। ధనవంతులకు భయ మిదిగదా తెలుఁగెం[illegible]।

శ్లో॥ బాలస్తావ త్క్రీడాసక్త। స్తరుణ స్తావ త్తరుణీసక్తః।
వృద్ధ స్తావ చ్చింతాసక్తః। పరే బ్రహ్మణి కోఽపి న సక్తః॥

క॥ బాలుఁడు క్రీడాసక్తుఁడు। వాలాయము గాఁగ వయసువాఁడు వధూటీ।
లోలుఁడు ముదుకఁడు చింతా। లాలసుఁడా లేఁడు బ్రహ్మలంపటుఁ డెవఁడున్॥

శ్లో॥ కా తే కాంతా కస్తే పుత్రః। స్సంసారోఽయ మతీవ విచిత్రః।
కస్య త్వం వా కుత ఆయాత। స్తత్త్వం చింతయ తదిహ భ్రాంతః॥

క॥ ఎవ్వతె నీకుం బ్రియసుతుఁ। డెవ్వఁడు సంసారమిద్ది యెంతయుఁ జిత్రం।
బెవ్వని కీ వరుదెంచితి। వెవ్వితమున భ్రాంతుఁడవయి యెంచుము నిజమున్॥

శ్లో॥ సత్సంగత్వే నిస్సంగత్వం। నిస్సంగత్వే నిర్మోహత్వం।
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం। నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః॥

క॥ కలిగిన సత్సంగతి మఱి। కలిగెడు నిస్సంగతి యది కలిగినయెడలన్ ।
గలుగు నిర్మోహత్వము। చలతత్త్వము దాన ముక్తి సమకూరు దానన్॥

3 శ్లో॥ వయసి గతే కః కామవికారః। శుష్కే నీరే కః కాసారః॥
క్షీణే విత్తే కః పరివారో। జ్ఞాతే తత్త్వే కస్సంసారః॥

క॥ ధనవయసు కామవికృతియు। ధనమింకిన నరుని లేమిఁ బరివారంబున్।
గనఁ దత్త్వము సంసారం। బును గల దెదియెందు నేనిఁ బోరిఁ బరికింపన్॥

3 శ్లో॥ మాకురు ధనజనయౌవనగర్వం। హరతి నిమేషాత్కాలస్సర్వం।
మాయామయమిద మఖిలం హిత్వా। బ్రహ్మపదం త్వం ప్రవిశ విదిత్వా।

క॥ ధనజనయౌవనగర్వము। నెనయకు నిమిషమునఁ గాల మెల్ల హరించున్।
మొనయక మాయామయమౌ। ల్లనిది యెఱిఁగి బ్రహ్మపద మలరఁగఁ జేరుమా।

శ్లో॥ దినయామిన్యౌ సాయంప్రాత। శ్శిశిరవసంతౌ పునరాయాతః।
కాలః క్రీడతి గచ్ఛత్యాయు। స్తదపి న ముంచ త్యాశావాయుః॥

క॥ తొలి సంజ సంజలు రేయి। పులు రేలు వసంతశిశిరములు మఱి వచ్చున్।
వడిఁ గ్రీడించుం జనుమనఁ। గలతఱి యాశానిలంబు గద విడువదహా॥

శ్లో॥ ద్వాదశమంజరికాభి ర శేషః। కథితో వైయాకరణస్యైషః।
ఉపదేశోఽభూ ద్విద్యానిపుణైః। శ్రీమచ్ఛంకరభగవచ్చరణైః॥

క॥ ఇది ద్వాదశమంజరికల। నుదితము వైయాకరణున కుపదేశం బ।
ద్యుదగఁ శంకరభగవ। త్పదుచే విద్యావిశారదప్రాగ్ర్యునిచేఁ॥

పద్మపాదుఁడు.

శ్లో॥ కా తే కాంతా ధనగతచింతా। వాతుల! కింతవ నాస్తి నియంతా।
త్రిజగతి సజ్జనసంగతిరేకా। భవతి భవార్ణవతరణే నౌకా॥

క॥ కాంతాధనగతచింతయ । దెంత నియంతయును లేఁడె యెఱిఁగింప నీ।
కెంతయు సంసారసరి। త్క్రాంతతరణి సత్ప్రసక్తి గలదొకటి గనన్॥

తంత్రోటకుఁడు.

శ్లో॥ జటిలో ముండీ లుంఛితకేశః । కాషాయాంబరబహుకృతవేషః।
పశ్యన్నపి న చ పశ్యతి మూఢో । హ్యుదరనిమిత్తో బహుకృతవేషః

క॥ చూచుచుఁ జూడఁడు మూఢుం। డేచి జటిలుఁ డేని ముండియేని వికేశుం।
డై చెలువగు కావులతో। నూచెల్ల యుదరనిమిత్త మూరువేషంబుల్॥

హస్తామలకుఁడు.

శ్లో॥ అంగం గళితం పలితం ముండం । దశనవిహీనం జాతం తుండం।
వృద్ధ్ [illegible] గృహీత్వా దండం। తదపి న ముంచత్యాశాపిండం॥

క॥ ముండము పలితము గళితము పిండము తుండము ద్విజానుపేతము గాఁగా।
దండముఁ గొని చను నాశా। పిండము నీ! విడువ దట్టివృద్ధునినైనన్॥

సుబోధుఁడు.

శ్లో॥ అగ్రేవహ్నిః పృష్ఠే భానుః। రాత్రౌ చుబుకసమర్పితజానుః।
కరతలభిక్ష స్తరుతలవాస స్తదపి నముంచ త్యాశాపాశః॥

క॥ ముందగ్గి ప్రొద్దు వీఁపునఁ। బొందఁగ రేయిటను గడ్డము న్మోకాళ్లన్।
జెందెడుఁ జేతం బెకెరం, బందం జెట్టుతల మాన దాసయు వానిన్॥

వార్త్తికకారుఁడు.

శ్లో॥ కురుతే గంగాసాగరగమనం। వ్రతపరిపాలన మథవా దానం।
జ్ఞానవిహీన స్సర్వమతేన। ముక్తిం నభజతి జన్మశతేన॥

క గంగాసాగరగమనం। బుం గావించినను దానముల వ్రతముల నే।
భంగిన్ జ్ఞానవిహీనుఁడె। సంగంగన లేఁడు ముక్తి జన్మశతమునన్॥

నిత్యానందుఁడు.

శ్లో సురమందిరతరుమూలనివాస। శ్శయ్యా భూతల మజినం వాసః।
సర్వపరిగ్రహభోగత్యాగః। కస్య సుఖం నకరోతి విరాగః॥

క పోల న్సురమందిరతరు। మూలనివాసంబు శయ్య భువి వల్వయుఁ దో
ల్వ్రేలినభోగత్యాగము। చాల దెవనికి న్విరక్తిసౌఖ్య మొనరుచున్॥

ఆనందగిరి.

శ్లో యోగరతో వా భోగరతో వా। సంగరతో వా సంగవిహీనః।
యస్య బ్రహ్మణి రమతే చిత్తం। నందతి నందతి నందత్యేవ॥

క॥ అవుఁగాక యోగి భోగియు। నవుఁగాక ననంగుఁడును గృహానంగుఁడుగా।
నెవనిహృది బ్రహ్మమందుం। దవిలియలరువాఁడె యెనయఁ దద్దయుముదము౯॥

దృఢభక్తుఁడు.

శ్లో॥ భగవద్గీతా కించిదధీతా। గంగాజలలవకణికా పీతా।
సకృదపి యేన మురారిసమర్చా। క్రియతే తస్య యమోపి న చర్చాం

క॥ ఇంచుక భగవద్గీతఁ బ। ఠించుం గంగాజలంబు ఠీవిం ద్రావు౯
గాంచనచేలుని భక్తిం భ। జించు నతం డతనిఁ జెనయఁ జేరఁడు జముఁడు౯।

నిత్యానాథుఁడు.

శ్లో॥ పునరపి జననం పునరపి మరణం। పునరపి జననీజఠరే శయనం।
ఇహ సంసారే బహుదుస్తారే। కృపయాపారే పాహి మురారే॥

క॥ జననము మరణము మఱిమఱి। జననీజఠరంబునందు శయనము మఱియున్।
ఘనసంసారసముద్రం। బున గృపచే నేలుమా మముఁ శ్రీరమణా!॥

యోగానందుఁడు.

శ్లో॥ రథ్యాకర్పటవిరచితకంథః। పుణ్యాపుణ్యవివర్జిత పంథః।
యోగీ యోగనియోజితచిత్తో। రమతే బాలోన్మత్తవదేవ॥

క॥ త్రోవలఁ జేలికలను గొని। కావించిన బొంతఁ గలిగి కని పుణ్యాపు
ణ్యావర్జితపథమును యో। గావిష్టుం డలరు బాలు నట్లు వెడఁగనన్॥

సురేంద్రుఁడు.

శ్లో॥ కస్త్వం కోఽహం కుత ఆయాతః। కా మే జననీ కో మే తాతః।
ఇతి పరిభావితనిజసంసార। స్సర్వం త్యక్త్వా స్వప్నవిచారః॥

క॥ ఎవ్వఁడ వెవ్వఁడ నేలా। యివ్వసుధకు వచ్చినాఁడ నౌతతే జనని నా।
కెవ్వఁడు జనకుండని భవ। మివ్వడి విడువుము సమస్త మిది కలకెనయా॥

మో ధారిధి.

శ్లో॥ త్వయి మయి సర్వత్రైకో విష్ణుః। వ్యర్థం కుప్యసి మయ్యసహిష్ణుః
భవ సమచిత్త స్సర్వత్ర త్వం। వాంఛ స్యచిరాద్యది విష్ణుత్వం॥

క॥ నీయందును నాయందును। శ్రీయుతుఁడౌ విష్ణుఁ డొకఁడె చెందెదు కినుకన్
నాయెడ మిన్నకయగుమా। యేయెడ సమచిత్తుఁడవుగ నిష్ట మజత యేఁగా॥

భారతీశంకుఁడు.

శ్లో॥ కామం క్రోధం లోభం మోహం। త్యక్త్వాత్మానం పశ్యతిసోహం
ఆత్మజ్ఞానవిహీనా మూఢాః। స్తే పచ్యంతే నరకనిగూఢాః॥

క॥ కామము క్రోధము లోభం। బామోహము విడిచి కాంచు నాత్మజ్ఞ సోహం।
నా మెఱయు నాత్మవేదిత। లేమి న్నిరయగులగుదురు లీల న్మూఢుల్॥

సుమతి.

శ్లో॥ గేయం గీతానామ సహస్రం। ధ్యేయం శ్రీపతిరూప మజస్రం।
నేయం సజ్జనసంగత మనిశం। దేయం దీనజనాయచ విత్తమ్॥

క॥ గేయము భగవద్గీతయు। ధ్యేయము మాధవునిరూప మెల్లప్పుడొగిన్।
నేయము సజ్జనసంగతి। దేయము విత్తంబు సుజన దీనుల కెందున్॥

శ్లో॥ మూఢః కశ్చన వైయాకరణో। డుకృఞ్కరణేఽధ్యయనధురీణః।
శ్రీమచ్ఛంకరభగవచ్ఛిష్యై। ర్బోధిత ఆసీ చ్ఛోధితకరణః॥

క॥ వైయాకరణుఁడు జడుఁడొక। డేయను వసియోఁ జదివి డుకృఞ్కరణే యం।
చాయెడ శాంకరతతిచే। నాతఁడు సుబోధితుఁడు శోధితాత్మకరణుఁడున్॥

కవిరత్నము.

క॥ గురుశంకర జయంబున । నరగం బరఁగింపఁబడిన శంకరవైయా
కరణుల సంవాదం బిది। గురువర! తెనిఁగించి యిడితిఁ గొను బిల్వేశా॥

సింహావలోకనము.

చ॥ విరచితమయ్యెఁ జయ్యనఁ గా వేంకటరత్నము చేత నేదిశం।
కరగురుశిష్యబోధితము గాంగతటంబున శబ్దశాస్త్రిపా
ఠరతున కాదిభాష నదిటం దగ నాంధ్రమునందుఁ గందముల్।
వరములు ముప్పదొప్పగను బండితసత్కృతి లిచ్చ మెచ్చఁగన్॥

సమాప్తము.

